ఓం

శ్రీరామమ్.



# సుజ్ఞాన బోధామృతము.

ఇయ్యది

ఏలూరు వాస్తవ్యులును

ఆర్య వైశ్యులునగు

పసుమర్తి రామయ్యగారి

పుత్రుడు

పసుమర్తి పురుషోత్తమునిచే

రచియింపబడి ప్రచురింపబడినది.

ఏలూరు:

రాజా ముద్రాక్షరశాల.

వెల. [illegible]

ఓం

శ్రీరామం.

# సుజ్ఞాన బోధామృతము.



ఇది

హేలాపుర శాస్త్ర్యాదగ్ర

పసుమర్తి పురుషోత్తమునిచే

రచియించి ప్రకటింపఁబడినది.



శారదా ముద్రాక్షరశాల, ఏలూరు.

౧౯౩౧.

శ్రీరామస్సహాయః.

చ. తెలుఁగున జ్ఞానసత్తములు
తేటఁగ వ్రాసిన బ్రహ్మతత్త్వముం
దెలిపెడు గ్రంథముల్ చదివి
తెల్వి గడించి సుబుద్ధిశాలివై
వెలసెడు పూరుషోత్తముఁడు
పెద్దల దీవెనఁగోరి పొత్తముం
దొలుతఁగ వ్రాసెఁగాన విబుధుల్
గుణముల్ గ్రహియింపఁ బ్రార్థితుల్.

ఏలూరు,
20—7—1921.

ఇట్లు,
కలువలపల్లి రంగనాథశాస్త్రి.

ఓం.

# విజ్ఞాపన.

సహోదరులారా!

అల్పజ్ఞానంబున పెద్దలవలన అప్పుడప్పుడు విని సంతసించుచు నే నెరింగిన కొన్ని విషయంబులు నామనంబున నుంచి కొనజాలక వెల్లడించు నుత్సాహంబున కొన్ని విషయంబులను గూర్చి యీపుస్తకము నచ్చొత్తించి ప్రచురించినాడను. గాని యిది క్రొత్తగ నెంచి లిఖించినదిగాదు. గాన చదువరులు యీ గ్రంథమును, నన్నును, క్రొత్తగ నెంచుకొనక యిందున్న విషయములను మాత్రము క్రొత్తగ నెంచి, చక్కగ చదివి, నిక్కము గుఱుతించి, మిక్కిలి మక్కువతో ఆచరణలోనికి తీసుకొని రాగలందులకయి సవినయంబుగ ప్రార్థించుచున్నాడను. ఇట్లు,

పసుమర్తి పురుషోత్తముడు, ఏలూరు.

ఓం.

శ్రీరామమ్.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుం డును, అండపిండ బ్రహ్మాండంబెల్ల నిండియుండు వాడును, అఖండసచ్చిదానంద స్వరూపుండును, ఆదిమధ్యాంతరహితుండును, నిరాకార నిరంజన స్వరూపుండును, అనంతకోటి రూపములచే ప్రకాశించువాడును, శతకోటి నామములచే పిలువంబడువాడును, అగు భగవంతుని కృపచే గల్గిన యీ ప్రపంచంబునందుగల అనంతకోటి జీవరాసులలోను మిగుల నుత్తమమయినది మానవజన్మ. అట్టి మానవజన్మనెత్తి మనము కాలమంతయు విషయసుఖములయందు, అంగా బాల్యమునందు ఆటలయందును, యౌవనమందు

స్త్రీలయందును, మందిరమందు ధన, ధాన్య, బంధు, మిత్ర, పుత్రాదులయందునుండి, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యంబులకు లోనై కాలమంతయు వృథా జేయుచు భగవంతుని మరచి విషయసుఖంబులు స్థిరంబు యెంచి విషయలోలురమయి, ధనధాన్యములు నశించినపుడును, పుత్ర, మిత్ర, కళత్రాదులు దూరమయినపుడును, శరీరము రోగముల పాలయినపుడును, భగవంతుని జ్ఞప్తికిదెచ్చుకొని రక్షకా రక్షించుమని తలంచుచుంటిమి గాని సర్వదా సర్వేశ్వరుని తలంచుట లేదు. ఇట్లుండుట మానుష, ధర్మముగాదు, ముక్తికి మార్గముగాదు, ధనమదంబు చేతను, బలగర్వంబు చేతను, గర్వించుట లేదుగాని యిట్లుండుట యంత

యు యోచించి చూచిన దుఃఖభాజనము, కర్మ ప్రాప్తము, పాపహేతువులయియుండును. గాన మాయలోమునింగి నిద్రించుచున్న ఓ మానవ సముదాయములారా ! మాయను అవలకు ద్రోచి నిద్రనుండి మేల్కాంచి మనకు అన్ని విధములు సుఖ సంతోషంబులు గల్గియున్న ప్పుడే యిది యంతయు సర్వేశ్వరుని దయయని తలంచి అనుదినము ప్రతి నిమిషమునందును శ్రీ సచ్చిదానంద స్వరూపుని మనంబున ఘనంబుగ చిత్తశుద్ధితో దలంచుచుండవలెను. అట్లున్నచో సర్వేశ్వరుండు సర్వదా గాపాడుచునే కష్టములు దానీయక యవసానకాలమున తోడ్పడి ముక్తి మార్గమును జూపించి తుదకు తన సాన్నిధ్యము నదెప్పుడొసగును ఇట్లు గాంచుచున్న నయుడు

జన్మ సార్థకమగు ప్రయత్నములు చేయుచు, వినుచు, చెప్పుచు, చేయించుచు పాటుపడ వలెను. అప్పుడు మన మెత్తినది మానవజన్మయని తలంచుటకు భక్త రక్షకుండగు భగవంతునికి కూడ అనుకూల దయ గల్గి సహాయించును.

భక్తియే ఆధారము.

భక్తిలేని మానవుడు ద్విపాదపశువే.

శ్రీ. శ్రీ. శ్రీ.



ఓం

శ్రీరామ.

సర్వాంతర్యామి యయిన సర్వేశ్వరుడు
సర్వ జీవులయందును సమాన దయ గలవాడు
తన భక్తులను రక్షించి దుష్టులను శిక్షించును.
భక్తుల కోరికలను కరుణతో నెరవేర్చు పర
మపావనమూర్తి అట్టి జగదీశ్వరుని సర్వదా
మనశ్శుద్ధిగా ప్రార్థన చేయుడి, దైవ సహాయ
ము నపేక్షించి ఇహమందు సుఖమును పర
మందు మోక్షమును పొందవలెను.

సత్యం శ్రీ.

ఓం

శ్రీరామ్.

# మానవ-ప్రార్థన.

రక్షకా, జగద్రక్షకా, పరాత్పరా, ఆప ద్బాంధవా, దయాంభోనిధీ, ఈశ్వరా, జగదీ శ్వరా, నిరాకారనిరంజన స్వరూపా!

నీచే గల్పింపబడిన యీ మాయాప్రపం చమున నీయొక్క సృష్టిచే జననమొందు సకల జీవరాసులయందును మిగుల నుత్తమ మయిన మానవజన్మమందు నన్ను పుట్టించినావు గాని నేను మాత్రము జ్ఞానశూన్యుడనయి అజ్ఞానమను అంధకారమున మునింగి ఈదులాడుచు దుస్సాం

గత్యముచే జ్ఞానమార్గమును తెలుసుకొనజాలక, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యంబులకులోనయి చిన్ననాటనుండియు మిగుల పాపకార్యములు చేయుచు, అసత్యములు పల్కుచు, అహంకారమును పొందుకొనుచు, మిగుల ఆపదల పాలగుచు, కడు దిగులొందుచు, సాధుసాంగత్యమును చేయక, మీ దివ్యనామ సంకీర్తనలు వినక, పుణ్య స్థలములను గనక, యీ మాయలోబడి జ్ఞానమునకు దాటగనలేక మిగుల దిగులొందుచుంటిని గాన దీనులను రక్షించి కృపజూచు ఓ జగద్రక్షకా నాయందు మిగుల కారుణ్యముంచి నన్ను మీ భక్తులలో ఒకనిగా నెంచుకొని నేనిదివరకు గావించిన పాపకార్యములను క్షమించి, నన్ను రక్షించి,

నా తప్పులను క్షమియించి. యిటుపయిని నా మనస్సు పాపకార్యముల దరి చేర నీయక, దుస్సాంగత్యమునందు విరక్తి గల్గించి, నన్ను ధన్యుని చేయుము దేవా! మహానుభావా! నీ దివ్యనామము నా మనంబున నెల్లవేళల మాదును స్మరించులాగున అనుగ్రహించి, సత్సాంగత్యమునందు బుద్ధి గల్పించి, భక్తిమార్గములయందు ఆశపుట్టించి, అనాథలయందు అభిమానము గల్గించి, జ్ఞానులయొక్కల వినయముగల్గించి, ఆ సత్యమునందు అనవ్యాము గల్గించి, నాజీవితకాలమంతయు నాబుద్ధి యీ మార్గమునుండి ఎరలకుండ చేసి, అనుదినము నేఁ చేయు ప్రతి పనికి ముందు నీ పాదారవింద ధ్యానము నా డెందమున నెక్కొనియుండులాగున నాకు బుద్ధి

గల్గించి యీ బుద్ధి చెదరకుండ చిన్ని వరంబు
నిచ్చి నన్ను ధన్యునిఁ జేయు సమయంబుగ ప్రార్థిం
చుచూ. సాష్టాంగదండ ప్రణామంబులాచరించు
చుంటిని పరమేశ్వరా రక్షించుము. పరాత్పరా
దయాసాగరా. సర్వేశ్వరా శరణంటిని కరుణిం
చుము కరుణించుము. శ్రీ. శ్రీ. శ్రీ.



ఓం.

శ్రీరామ

# ౧ విచారణాధ్యాయము.

విచారణలేని మానవునకు సర్వవిషయములు లాభములువలె గాన్పించును. విచారణవలన గాని అందుండు లాభములు, నష్టములు, గాన్పించవు. గాన విచారణయనునది ముఖ్యావసరమయియున్నది. నిత్యము విచారణచేయుచు అందునుండి విషయములనుబాసి, దుర్వ్యసనములను మాని, జ్ఞానమును సంపాదించవలయును.

---

# ౫ సద్విద్య నార్జించుము.

వెండిబంగరు నాణ్యములకన్న విద్యాధనము అధికము. విద్యాధనము పరులు దొంగిలించుటకు వీలుకాదు. ఇతరులకొసంగిన మరింత పెరుగునది. సభలయందు పూజింపబడునది. జ్ఞానబలమునిచ్చునది. వెండిబంగరులను నిర్లక్ష్యముగ సాధించునది. వెండిబంగరులు ఆశపుట్టించును, అహంత గల్గించును, చోరులవలన భీతి వాటిల్లించును, అన్యాయములకు త్రోవచూపును. మోహములను వృద్ధిచేయును, తుదకు నశించును, ఆవల దుఃఖమొసంగును, గాన విద్యాధనమే ముఖ్యంబుగ నెంచి శ్రమపడి విద్యయను శాశ్వత ధనంబును సంపాదించవలయును.

# 3 జ్ఞానరత్నమును సంపాదించుము.

జ్ఞానమనునది స్వయంప్రకాశము. జ్ఞానము శిరోభూషణమువంటిది. సూర్యునిరాకచే నిద్రపోవు కటికచీకటి పోయి వెలుతురుగల పగలు వచ్చునట్లు జ్ఞానమువలన పాపములు నశించి, పుణ్యము చేకూరును. అంధకారమయిన చీకటిలో దీపము సహాయకారియై యెట్లు మార్గము జూపునో, అట్లేజ్ఞానము అజ్ఞానమునుబాపి ముక్తికి మార్గము జూపి సర్వదా రక్షించి కాపాడును.

# ౪ అజ్ఞానమును విడువుము.

అజ్ఞానము అంధకారమువంటిది. చీఁకటి, రాజమార్గములు అనేకములుండఁగా, దొంగమార్గమునఁబెట్టి ముండ్లకంచెలలోనో, నూతులలోనో, గోతులలోనో, పడఁద్రోసి అనేకకష్టములు గల్గించును అట్లే అజ్ఞానము అనేకకష్టములు గల్గించి తుదకు నరకమునకు మార్గము చూపుచుండును. కావున సుజ్ఞానమను దీపమును ప్రకాశింపఁజేసి అజ్ఞానమను అంధకారమును నశింపఁజేసి పరమార్థముకొరకు పరుగెత్తవలయును.

# ౫ దేవుని మఱువవద్దు.

మనలను పుట్టించి అనేకవిధములఁ గాపాడి రక్షించువాఁడు దేవుఁడు. దేవునిదయ లేనిది మనము ఏమియు నెఱవేర్పఁజాలము. గాన అట్టి దేవుని మఱవక సదా చిత్తశుద్ధి గలిగి మనంబున బూజించుచు ఆయన దయకు పాత్రులము ఇహపరసుఖంబుల నందఁ బ్రయత్నములు చేయుచు మన మనుభవించుచున్న విషయంబులన్నియు అశాశ్వతంబులని తెలిసి దేవుఁడే శాశ్వతుఁడని మదినెంచి సర్వదా సర్వకాలకర్తయగు దేవుని ధ్యానించుచు నడవలెను.

# ౭ సత్యమువిడువవద్దు.

సత్యమనునది నిత్యమునకు అన్ని విషయములలోను మిగుల సహాయకారియయి కాపాడుచుండును. సత్యము శిరోభూషణమువంటిది. సత్యమువంటిరక్షకత్వము మరియొకటి లేదు. అనేకకష్టముల పాలగుచున్నను సత్యము తుదకు సుఖములు చేకూర్చి ఆనందసాగరంబున నోలలాడించును గాన సత్యమును వదలక జాగ్రత్తగా గాపాడుకొనవలెను.

# ౬ అసత్యము పలుకవద్దు.

అసత్యము పిశాచమువంటిది. పిశాచము పట్టినవారికి మతి పోయినట్లుగా అసత్యములు పల్కిన వారు మతిపోయి విచారము చేకూరి తలిదండ్రులకు దూరులయి పుత్త్రులకు శత్రులయి, మిత్రులకు విరోధులయి, నరకప్రాప్తులయి, అన్నివిధముల భ్రష్టులయి చెడుదురు. గాన అసత్యమను పిశాచమును సత్యమను మంత్రబలముచే దూరముగ పారద్రోలవలయును.

# ౧౦ పరకాంతలను తల్లులని యెంచుము.

పరకాంతలను జూచి భ్రమించుట పాపము. భ్రమించి రమించుట నరకము. గాన అట్టి పాప కార్యములు చేసి అర్ధాంగిచే వ్యర్థు డనిపించు కొనక తుదకు నరకకూపమున బడక పరకాంతలను గాంచినంతనే మాతృభావమునొంది నమస్కరించి సద్గుణశాలివై పరకాంతలను గోరు కడుప్రాయులకు బుద్ధిగఱపి సర్వదా సర్వేశ్వర ధ్యానము సలుపవలెను.

# ౧౧ పరధనంబును తృణంబుగ నెంచుము.

పరధనంబును కాంక్షించినచో దనధనంబు నశించునుగాని పరధనంబు చేకూరదు. దుఃఖము మాత్రము చేకూరును. ఎవరికి ఎంతప్రాప్తమో అంతే కలిగియుండును. అత్యాశవలన ఆనందము నశించును. గాన పరధనాపేక్షను దరిచేరనీయక యున్నదానితో సంతృప్తికలిగి ధర్మన్యాయమార్గంబున అధిక ధనం బార్జింపుచు సదానందించుచుండవలెను.

# ౧౨ ధనవినియోగము జేయుము

ధనమార్జించి సద్వినియోగమైన పనులకు సదామనశ్శుద్ధితో ఖర్చుపెట్టవలెను. గాని ధర్మము చేసినచో తరిగిపోవునని తలంచి తాను తినక పరులకు పెట్టక జాగ్రత్తగ దాచి వృద్ధిపరచగోరువారు యెంత ధనవంతులయినను దరిద్రులకన్న దరిద్రులే అనబడుదురు గాన శ్రమపడి యార్జించిన ధనము ఆనందముతో తమజీవితకాలములోనే పరోపకారమునకై అనేక దానధర్మములు చేయవలెను.

## ౧౩ వెలకాంతలఁ గూడకుము.

వెలకాంతలు ధనములాగుటకయి మోహము పుట్టించి ధనవంతులను దరిద్రులను జేయుదురు. నిరోగులను రోగులుగ జేయుదురు. ఆప్తలను దూరము జేయుదురు దుఃఖము కలిగింతురు. తుదకు నరకకూపమునకు దారిజూపుదురు. గాన అట్టి నీచతాహేయతా దుఃఖ నిందలకు పుట్టినిండ్లగు వారకాంతలపొందు కలనైనను మనంబున దలంపక కులకాంతతో సంతసించుచు సర్వదా సర్వేశ్వరుని ప్రార్థించుచుండవలెను.

# ౧౪ కులకాంతను దూఱకుము.

కులకాంతయనునది అర్ధాంగి. మనకష్టసుఖములకు మిగుల సహాయకారిణి. ముక్తికాంతను గనుగొనుటకు మార్గముఁజూపు శక్తిశాలిని. అన్ని విషయములయందును మిగుల సహాయకారిణి. కులకాంతను దుఃఖాంతఁ జేసిన పురుషునకు సుఖంబు లేదు. అన్నివిధముల దుఃఖములే వాటిల్లుచుండును. మోక్షమార్గంబును గనుగొనజాలఁడు. గాన అర్ధాంగియగు కులకాంతను సర్వవిధముల సంతసపరచి సదా సర్వేశ్వరధ్యానము సలుపవలయును.

# ౧౫ ఆనందమును వదలకుము.

సన్మార్గములయిన సంతోషము సర్వవిష
యములకును బలము నిచ్చును. సంతోషముచే
యెట్టి గట్టి పనినైనను సులువుగ సాధింప
వచ్చును. సంతోషము లేని మనుజుడు రోగపీడి
తుడయి తేజోవిహీనుడయి యుండును. గాన
చిత్తశుద్ధితో ఆనందమును సంపాదించి సదా
శ్రీహరి పాదారవింద భక్తిసల్పుచు ముక్తిం
గనుటకు శక్తి వంచనలేకుండ పాటు పడవలెను.

# ౧౬. చింతను చేరనియ్యకుము.

చింతయనునది పెనుభూతము వంటిది. ఈ చింతయను భూతమునకు మందు మంత్రములు లేవు. అగ్ని వ్యాపించిన వారినే దహించు చేయును గాని చింత సజీవులనే దహించు చేయును. గాన చింతయను మహాభూతమును సంతసమను మహామంత్రమును ఉపన్నన నిము కొని చింతను చేరనియ్యక సదా సంతోషముతో శ్రీహరి కరుణకు పాత్రులయి యుండవలెను.

# ౧౭ ఆశను పెంచకుము.

ఆశయనుదాని పొడవు లెక్కించుటకు శక్యముగాదు. ఆశకు మేర లేదు. ఆశను పెంచుకొనుట దుఃఖమునకు హేతువు. సుఖమిను మంతయయినను లేదు. ఆశగలవాడు యెంతధనాఢ్యుఁడయినను ధనహీనుడే యగును. అధికాశవలన మోహభంగముగల్గును. గాన ఆశను పెంచుకొనక తృప్తిని పెంచుకొనుచు ధర్మమేజయమను దానిని మనస్సున నుంచుకొని సదాధర్మము నాచరించు చుందుము.

# ౧౭ సత్సహవాసము జేయుము.

సత్సాంగత్యము వలన సద్విషయములు గానవగును అందువలన సద్విషయములు చేయ నగును. ఆవల భక్తి, జ్ఞాన, వైరాగ్యములు సిద్ధించును. అవి ఆచరించిన ముక్తి మార్గంబుగాన నగును. గాన సజ్జన సహవాసముకొఱకు పాటు బడి సత్సాంగత్యమును సంపాదించి చిరకీర్తి నార్జించి మోక్ష ప్రాప్తిని జెందవలయును.

# ౧౮ సతీసుతులు స్థిరంబని యెంచకుము.

ఆలుబిడ్డలు లోకసంబంధమయిన ఆప్తులే గాని, ఆపత్కాలమున రక్షించువారు గారు. ప్రేమచూర్పుచు వెంటవచ్చువారును గారు. మృతులయినవారిని గడియైనను యింటనుంచువారును గారు. అట్టి అశాశ్వతంబయిన ఆలుబిడ్డలు మొదలగువారి యెడల నిశ్చలమోహమును వెంచుకొనక సదా కాపాడి ఆపత్కాలమున రక్షించి అంత్యమున మోక్షంబిచ్చు శ్రీ సచ్చిదానంద స్వరూపుని సర్వదా భజించుచు వరసౌఖ్యములకయి పాటు పడవలెను.

# ౨౦ కాలము వృథా చేయకుము.

కాలమును ప్రాణముకంటె అత్యధికముగ చూడవలెను. అవసానకాలమున ప్రాణమును దైవశక్తి చేతనో, రోగబలము చేతనో, అప్రమత్త తచేతనో [illegible] అగువచ్చును. ఇట్టి ప్రాణతుల్యమయిన వస్తువు పోయినను తిరిగి సంపాదించ వచ్చును. గాని పోయిన కాలమును తిరిగి తేఁజాలము గాన ఇట్టికాలమును వ్యర్థముగా పోనియ్యక అతిజాగ్రత్తగలిగి సదా భగవద్భక్తిగలిగి పరోపకారమునకయి పాటుపడుము.

# ౨౧ అనుమానమును మనంబున నుంచకుము.

అనుమానము పెనుభూతము వంటిది. దేహ వ్యాధులైనచో మందుగలదు గాని అనుమానము అను మనోవ్యాధికి మందు లేదు. గాన ఎట్టి అనుమానమును మనంబున నుంచుకొనక అనుమానము గలిగినప్పుడే గురులవలన ఆ యనుమానమును నిర్మూలము చేసికొని నిర్మలమనస్సుగలవాడవయి మోక్షము సిద్ధించునా లేదా యను యనుమానముతో సదా పరమేశ్వర పాదపూజ చిత్తమున సల్పుచుండుము.

# ౨౨ పరనింద చేయకుము.

పరులను నిందించుట పాపమునకు మార్గము మనకనేక నిందలుండి యున్నను. మన తప్పులను మన మెరుంగజాలము. ముందుగ మన తప్పులను మనము లెక్కించినచో పరుల తప్పులు గాన్పించవు. తప్పు చేయువారు పాపప్రాప్తులయ్యెదరు. అట్టి పాపుల తప్పులను పొంది నిందించుట ఆ పాపములను పంచుకొనుటయే గాన పరనింద చేయక సదా పరతప్పులను దిద్దుకొనుచు తప్పులు చేయువారలను నిర్మలస్థలంబునకు తీసుకువెళ్ళి వినయపూర్వకమయిన బోధచేసి మంచిమార్గమునకు తీసుకొని రా ప్రయత్నములు సల్పుము.

# ౨౩ ఆత్మస్తుతి జేయవలదు.

ఆత్మస్తుతి యనగా తన్నుఁదాఁబొగడుకొనుట అందువలన ప్రజాద్వేషి వగుదువు. నీవు చేయు పని మిగుల మంచిదయినను ఆత్మస్తుతి వలన ఫలము లేక పోవును. గాన నీవు చేయు ప్రతిమంచి పనియు లోకప్రఖ్యాతికి అపేక్షించక దైవభక్తితో పరసౌఖ్యమునకై గుప్తముగానే చేయుచుండ వలయును.

# ౩౮ విద్యాదానము జేయుము.

ఒక్కొక్కనికి నీవు విద్యగఱపించినచో ఆ యొక్కొక్కరు వేర్వేరుగ పెక్కుమందికి నేర్పుచుందురు. అందుమూలమున అనేకమందికి అనేకలాభములు గల్గును. ఆలాభములకును ఆవిద్యావివేకులకును సహాయకారివి నీవేయగుదువు. గాన విద్యాదానము చేయుము. విద్యవలన అనేకలాభములు కలిగి తుదకు దైవభక్తిమార్గము సులువుగ లభించును. గాన విద్యాదానమునకు వెనుదీయకుము.

# ౩౮. ధన గర్వమునుంచకుము.

ధనముగలదని గర్వించవలదు. ధనమునకు మనమును మనకుధనమును శాశ్వతంబులుగావు గాన అస్థిరంబైన తనువునకు అశాశ్వతంబైన ధనము చిక్కి ధనాఢ్యుడుగా నున్నయప్పుడే తన జీవితకాలములోనే పరోపకారములకై ఖర్చుపెట్టుచు పరులను సంతోషపెట్టుచు తాను సంతసించుచు మానవధర్మమును గాపాడుకొనుచు సుజనవిధేయుడవై ధన గర్వమునుచెంత జేరనియ్యక కాపాడుకొనుము.

## ౩౯. నిన్నెవరయిన నిందించిన నీవు శాంతింపుము.

ఇతరులు నిన్ను నిందించునప్పుడు అందుకు బదులు నీవును నిందించినచో నుభయులును సరియయిన నిందాపాత్రులే యగుదురు. గాన ఆ కాలమున నీవు శాంతించి నెమ్మదిమీరను నిన్ను నిందించుటకు కారణమయినచో సిగ్గుపడి తన తప్పునకు తానే నిందించుకొని శిక్షించుకొనుము. పరులు నిందించుటకు తగిన విషయములు నామాత్రము నీయందు నుండనీక మంచివిషయములను వర్తించుచు కాపాడుకొనుచుండవలయును

# ౨౭ వేళ నతిక్రమించి భుజింపవలదు.

సరియయిన కాలమునకు భుజింపకున్నచో మనలోనుండు జీవాత్మ ఆకలికి సహింపలేక రక్త మాంస మల మూత్రములను వేళకు భుజించి వేయును. అందువలన మనకు వ్యాధులు కలిగి బాధలు పడుదుము. అదియును గాక జీవాత్మను ఆకలిచే బాధపెట్టి అపాయమును కట్టుకొనెదము. గాన ఆకలియయినపుడే సకాలమునకు భుజించి శరీరమును గాపాడుకొని సర్వదా నీ యాకలి నెట్టిదో పరుల యాకలియు నట్టిదేయని యెరింగి కలిగిన దానిలోనే బీదలగు జనుల ఆకలినిదీర్చుచుండవలెను.

## ౩౮ మితిమీరి భుజింపవలదు.

ప్రయాణవేళ లభించినదనియు, రుచిగా నున్నది యనియు, ప్రేమించి మితినతిక్రమించి భుజించినచో అది సరియయిన జీర్ణముగాక జీర్ణకోశమునకు బలహీనము గలిగి గర్భమున నిలచి జాస్తియయిన పదార్థము చెడి రక్తమును పాడు చేసి బలహీనము గల్గించి వ్యాధులపాలు చేయును గాన మామూలు పదార్థములనే క్రమముగా భుజించి దేహసుఖమును నార్జించుము.

# ౨౬ దేహపరిశ్రమ జేయుము.

దేహపరిశ్రమ ప్రాతఃకాలమున సదా చేయవలయును. అందువలన రక్తము సరిగా పారుదల అగుచు క్రొత్తరక్తము పుట్టుచు నరములకు బలముగల్గి శరీరము మిగుల పటుత్వము గలదియై మిగుల కాంతి కలిగియుండి భుజించిన పదార్థములను వెంటనే జీర్ణశక్తి దెచ్చును. వ్యాధులను దరికి జేరనియ్యక గాపాడును పరుల సహాయము లేకనే యెవరినైనను సులువుగ స్వయముగ చేయుగలశక్తి గలుగును. ఆయుర్వృద్ధి గలుగును గాన దేహపరిశ్రమను తప్పక అనుదినమును ఆచరించు చుండవలెను.

# ౩౦ ప్రాతఃకాలస్నాన మాచరింపుము.

అన్నింటియందుకన్న నీటియందు బలము అధికము. అట్టి అధికబలముగల నదియందుగాని చెరువునందుగాని, నూతుల యందుగాని, అను దినము సూర్యోదయమునకు ముందు స్నాన మాచరించవలయును. అందువలన శరీరమునందు గల మురికియంతయు వదలి ఆనీటిలోనున్న మంచి బలము మనలో ప్రవేశించి దేహబలము శరీరకాంతిని, కల్గించి శుద్ధిగావించును. స్నానము చేయునప్పుడు యేకదృష్టితో నరులతో ప్రసంగించక యీ నీటిలోని బలము నాలో చేరి నాకు సుఖము గలుగుగాక యని దీక్షతో 15 నిమిషములు మాత్రము స్నానము చేయవలయును.

# ౩౧ దృష్టిని నిలకడచేయవలెను.

దృష్టి నిలకడలేని మనుజుడు యెంతప్రయత్నముచేసి యెంత ధనము ఖర్చుపెట్టి యేపనిని చేయబూనినను ఆపనిసాంతము గానేరదు. గాని పర్యంతమునకు మాత్రము పూర్తిగా చింతచేకూరును. గాన నీవు ఏదయిన పనిచేయదలచినపుడు పూర్తిగ యోచించి దృష్టి దానిపై నిలిపి కార్యదీక్ష వహించినచో అది యెంతటి పనియైనను సులువుగా సాధ్యమగును.

# ౩౭ ధ్యానలేని విద్య నభ్యసింపవలదు.

నీవు చేయు పనియందుగాని నీవు చేయించు పనియందుగాని నీకు పూర్తియయిన నమ్మిక అభిమానము, భక్తి, స్థిరముగా నుండునట్లు చేయవలయునుగాని పనుల పెత్వకారకుడను, ఆత్మస్తుతి కారకుడను, ధనముగలవాడనను, చేయుట, చేయించుటవలన ఏమియును ప్రయోజనము లేదు. ధ్యానలేకుండా కూర్చుని కథవినుచు వధను గురించి విచారించుచున్నవానికి కథ సారస్యము ఏమి విశదమగునుగాన ఏ పనియందుగాని ధ్యానను పూర్తిగానుంచి చేయుచుండవలెను.

# 33 స్థిరమయినదానిని తెలిసికొని అట్టిదానికయి పాటుపడవలెను.

సర్వ కారణకర్తయు, సర్వసాక్షియు, ఆది మధ్యాంత రహితుండును, అగు భగవానుని యనుగ్రహ సంకల్పముచే కల్పింపబడిన యీ లోకంబంతయుం ఒక్క రాత్రిజరుగు నవీన శృంగార, హాస్య, దుఃఖ, సంతోష, విస్మయము లను జేర్చి కడువేడుకగా జూపించు నాటకము మనకెట్లో, అట్లే యీ ప్రపంచమును నొక నాటక రంగస్థలంబుగ జేసి అందు సకల చరాచరంబు లను గల్పించి, తద్వారా అనేక శృంగారము

లను గల్పించి, అందు కష్టసుఖములను, సుఖ
సంతోషములను, శృంగార వికారములను
ఆకార నిరాకారములను, లాభ నష్టములను,
దయానిర్దయులను, మొదలగు అనేకవిషయంబు
లను మానవ, పశు, పక్షి, క్రిమి, కీటకాదులను
బహువిధములయిన వృక్షజాతులను, వివిధనదు
లను, ఘోరభయంకరముగు వనంబులును, లెక్క
లేని మహాపర్వతంబులను, గల్పించి మనచే లోక
నాటక మాడించుచు జూచుచున్న యాపరాత్ప
రుని మాయాలోకంబు గాని మరియొకటి గాదు.
ఈలోకనాటకము గూడ లోకాంతమున ముగి
యును. యిందు స్థిరమయినదేదియును గాన్పిం
చదు. ఇందు సతి, సుతులు, హితులు, బంధు

వృలు, భృత్యులు, ధనధాన్యములుగల్గి సుందర
భవనంబులందు అమిత మోహపర వశులయి
కన్నుమిన్ను గానక అతివిశాలమగు అమితానం
దముతో యిదియంతయు స్థిరంబని యెంచుచు
స్త్రీలోలురయి యిదత దీక్షమున కాశించు చం
దంబున. విషయసుఖంబుల కాశించుచుందురు.
ఇందు యెంచిచూచిన యేదియుస్థిరంబుగాదు.
జననీజనకులు నశింతురు. భార్యబిడ్డలు నశిం
తురు. మనము నశించెదము, నశించువారు నశిం
చుచునే యుందురు. జననమొందువారు జనన
మొందుచునే యుందురు. ఒకరికొకరుసంబంధమే
లేదు. ధనము దొంగలివాని అద్దమువలె పలు
చోట్లు తిరుగుచు ఒకరిని మోహపరవశునిగా

చేయును. ఒకనిని చేరి సంతసింప చేయును. ఒకరి వద్దనుండి జారిపోయి దుఃఖితులుగా చేయును. ఐశ్వర్యమున నోలలాడించును. దారిద్ర్యమున ముంచి తేల్చుచుండును. సోదర భగినులు నేడు మనవిగాను రేపు పరులవిగాను మారు చుండును. యిందేదియును మనకంటవు. మన వెంట రావు. యీలోకమున స్థిరమయిన దేదియును లేదు. లేదు. లేదు. అట్టి అస్థిరమయిన లోక వాంఛను తెంచుకొని లోకహితమయిన కార్య ములను చేయుచు పుట్టుచు, చచ్చుచు నుండుటే గాని తన్నుతా తెలుసుకొనుట మాత్రము లేదు. మాయాప్రపంచమున మహానిద్రలో మునింగి కొంతకాలము సుఖులమయి యుందుము గాన

తన్నుఁ దా దెలిసికొను విషయము మానవులకు
అవసరమయిన విషయము గాన ప్రప్రథమమున
తన్నుఁదా దెలిసికొని తాను జేయవలసినకృత్య
ముల నెఱింగినచో స్థిరంబయిన వస్తువులను గను
గొన శక్యమగును. అట్లు తనవిధి తానాచరించి
నచో మాయనువిడచి జ్ఞానప్రకాశుడయి యీ
లోకమంతయు కల్లయని యెఱింగి అస్థిరమంతయు
నశించినను ఆవల స్థిరముగ ప్రకాశించుచు చల
నము లేక నిలిచియుండు పరమాత్మ ప్రకాశము
గానవచ్చును. అట్లు తదేక నిష్ఠాగరిష్ఠుడయి
భగవద్భక్తియే స్థిరంబని నమ్మియున్న వానికి
పురాణపురుషుడైన యాభగవంతుడు ప్రసన్ను
డయి తనసాన్నిధ్యమున చేర్చుకొనును. గాన

# Dongre's Balamrit.

——:o:——

ఈ బాలామృతము వంటి బిడ్డలకు అమృతమువంటిది. పాలను త్వరలో జీర్ణముచేసి శరీరమునకు బలమును కాంతిని యిచ్చును.

వసుమర్తి పురుషోత్తము,
మద్దుల వెంకటసుబ్బారావు,
బట్టల షాపు,
ఏలూరు.

——

# "Glaxo."

"గ్లాక్సో" పాలు చంటిబిడ్డలకు చాల వుపయోగకరమయినవి. ఈపాలు చనుబాలతో సమానమయిన గుణమును, బలమును యిచ్చును. చనుబాలకు యేవిషయమునందైనను యెంత మాత్రము దీసిపోవు. బజారులో దొరకెడి అన్ని రకముల పోతపాలలో యివియొక్కటి శ్రేష్ఠమయి నవి. అనేకమంది యీ పాలనుపయోగించి వాటిలాభమును బొందుచున్నారు. ఒకసారి ఉప యోగించి చూచిన వాటిగుణము తెలియగలదు.

పసుమర్తి పురుషోత్తము,

మద్దుల వెంకటసుబ్బారావు,

బట్టల షాపు,

ఏలూరు.

